శ్రీరస్తు.

# స్త్రీనీతిరత్నాకరము.

ఇది

శ్రీశంబరద్వీపవాసియైన

చెన్నాప్రగడ రామమూర్తిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు.

శ్రీవాణీముద్రాక్షరశాల

బెజవాడ.

1898.





తరంబుగూడ సంభవించిన

# పీఠిక.

ఒకనాటిరేయి నేనును పండితులగు నామిత్రులును కలిసి స్త్రీవిద్యాభ్యాసమునుగూర్చి ప్రసంగించుచుండఁగా నిచ్చటి బాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయుఁడును మన్మిత్రవర్యుఁడును నగు బ్రహ్మశ్రీ ముష్టి రామకృష్ణశాస్త్రిగారు నన్నుఁజేరి యిట్లని వాక్రుచ్చిరి.

చ॥ వినుమిటు మిత్రశేఖర! కవిత్వపటుత్వము నేర్చియుంటివే।
వనుమతిబాలికామణుల కందరకుందగయుక్తమై భువిన్।
దనరెడునీతిగ్రంథ మొకదానిని వ్రాయుమటంచు బల్కఁగా।
మనమునబొందిసంతసము మత్సఖువాంఛను దీర్పఁజెప్పితిన్।

కాని,

ఆ॥ వె॥ ఈశ్వరేచ్ఛచేతనిలఁబాసిమాయంబ।
సద్గుణనికురుంబశాయిమాంబ।
శోకమిడుచునుబరలోకవాసినియౌట।
చేనశించెమతివిశేష మెల్ల॥

హృదయవిదారణదారుణంబైన నిట్టిదుఃఖమును బొంది కుందుచుండఁగా గోరుచుట్టుమీఁద రోకటిపోటన్నచందమున మరల దుస్సహ దీర్ఘవిదారణంబైన సోదరమరణంబుగూడ సంభవించిన

హేతువుచేత మదికుదురమింజేసి నాకియ్యదియసా
ధ్యంబని యూరకుంటిని, కానిమరలమిత్రోత్సాహ
భంగంబు సేయఁజాలక నేనీగ్రంథమును వ్రాయఁ
బూనుకొంటిని. కాన నిందొకచోఁ బ్రమాదవ
శంబున,

ఆ॥ వె॥ తప్పులుండనేనిఁ దగదిద్దిసునబుద్ధి।
వృద్ధి కాఁగ మీరలిద్ధచరిత।
లార! కరుణఁజూపఁ గోరెద ననిశంబుఁ।
జాలఁగొలుతు మిమ్ముఁ గేలుమొగిచి॥

భీమవరము,
ది 15 జనవరి 98.

ఇట్లు, విధేయుఁడు,
చెన్నాప్రగడ రామమూర్తి.



శ్రీరస్తు.

# స్త్రీనీతిరత్నాకరము.

క॥ శ్రీకరుఁడు సర్వశక్తుఁడు।
లోకేశుఁడు సర్వసాక్షి లోకనుతుఁడు నౌ।
శ్లోకుఁడు శాశ్వతుఁడైచను।
వాకల్యాణగుణుఁ బనీశు నాత్మఁ దలంతున్॥ ౧॥

## గురుస్తుతి.

క॥ గురునిన్ గురుతరకవితా।
పరునిన్ నందూరివంశపాథోధిసుధా।
కరునిన్ శంకరసత్కవి।
వరునిన్ హృత్కమలమందుఁ బ్రస్తుతిఁ జేతున్॥ ౨॥

## దైవభక్తి.

క॥ ఎవ్వఁడొ లోకాధారుం।
డెవ్వఁడొ పరిశుద్ధుఁడాద్యుఁ డెవ్వఁడొ యభవుం।
డెవ్వఁడొ సర్వవ్యాపకుఁ।
డెవ్వఁడొ యవ్విభుఁడె దేవుఁ డెప్పుడు మనకున్॥ ౩॥

క॥ వనితామణి! మదిమఱువక।
వనఘాత్ముఁడు లోకనాథుఁడైచను దేవున్।
మనమున నీవనుదినమును।
నుతింపఁగవలయు నన్నావిశ్రుతభక్తిన్॥ ౪॥

# శ్రీ నీతిరత్నాకరము.

క॥ మేనుఁదెలియరానినిదురఁ।
బూనినతఱినన్నుఁగరుణఁబ్రోవుమటంచున్।
మానిని! రాతిరిదేవుని।
ధ్యానముసేయంగవలయుఁదద్దయుభక్తిన్॥౧॥

## పతిభక్తి.

క॥ పతియేదైవసమానుఁడు।
పతియేసతతంబుభోగభాగ్యావళియౌ।
పతియేధనమున్బ్రాణము।
పతియేసకలమ్ముసుమ్ముభామలకెల్లన్॥౧॥

క॥ నాతికినిరతంబునువి।
ఖ్యాతినిఁగలుగంగఁజేయఁగాఁజాలినదీ।
భూతలముననాభరణము।
పాతివ్రత్యంబెపరమపావనమగుచున్॥౨॥

క॥ పతికడుఁగురూపియైనను।
హితమతిఁదత్సేవఁజేయుటెప్పుడుసతికిన్।
క్షితినతులితభూషణమగు।
ఇతరాభరణములుకాంతిహీనంబులగున్॥౩॥

క॥ పనినుండివరుఁడువచ్చిన।
వినయవినమితాంగివగుచువెలఁదుక!సద్భా।
షణగణములశ్రమమాన్పుము।
పనివడిపాదుగిండ్లఁబోయవచియుంఫలమీ॥౪॥

క॥ నీపతి యెవ్వఁడైన నమిత।
కోపనుఁడై తిట్టి పట్టి కొట్టిన తఱిని।
వోపికఁ జూపుచు లేశము।
కాపట్యముఁ జాల్పఁబోకు కాంతుని యెడలన్॥౧౦॥

క॥ ఎప్పుడు పతి చెప్పిన పనిఁ।
దప్పక చేయుచును భక్తిఁ దచ్చిత్తముగా।
నొప్పొప్పఁగ నవలంబించుచు।
నొప్పిదమగు సొప్పఁ జెందుమో కళ్యాణీ॥౧౧॥

క॥ పెనిమిటి దుష్టుండైనను।
వనితామణి! నీవు నీతివచనచయంబుల్।
మనమున నాఁటఁగఁగ నుంచుము।
గొనకొని నిందించు టెప్పుడుఁ గూడదు సుమ్మీ॥౧౨॥

క॥ లలనామణి! కలనైననుఁ।
దలపోయకు వరుని దోషతతులను సతతం।
బలనతఁడతులితదుష్కృత।
ములఁ జేసిన నీవు తాన్మిబోధింపవలెన్॥౧౩॥

క॥ పతులగుదురంగహీనులు।
సతులకుఁ దప్పకను దైవసంకల్పమునన్।
క్షితినెప్పుడు దూషింపక।
యతిమీఱిన భక్తితోడ నొలఁగఁగవలయున్॥౧౪॥
మదిఁ గోరకు పరపురుషుల।
సుదతీమణి! వారలెంత సుందరులైనన్।

జెదరకతృణముగనెంచినఁ।
గవశాశ్వతకీర్తిఁ బడఁగలుగుమజగతిన్॥౧౪॥

క॥ మగఁడిలవశ్యుండగునని।
దగమందులుమాత్రికులొసఁగఁదగదదియొక్కటే।
తెగుళులఁ దెచ్చుఁబతిగనిన।
దిగనాడఁ జేతొంటిప్రేమదృఢకోపమునన్॥౧౫॥

క॥ కాంతామణి! యెన్నఁడునీ।
కాంతుఁడుగృహమందులేనికాలమునందున్।
సంతసమందుచుఁజారుల।
కాంతాదులమేనఁబూననాశింపకుమీ॥౧౬॥

## గురుభక్తి.

క॥ అరయంగవిద్యఁగఱపిన।
గురువరుఁడనతండ్రిఁబోలెగురుతరభక్తిన్।
నెరపుచుఁగృతజ్ఞతగలిగి।
తరుణీమణిమెలఁగవలయుఁదానవయంబున్॥౧౭॥

క॥ ముద్దియ!నీకిలబుద్ధియు।
విద్దెయుఁగఱపికడువేడ్క-విమలపథంబున్।
బెద్దగఁజూపినగురువరుఁ।
దద్దయుఁబూజించుటవరధర్మముగాదె॥౧౮॥

## సత్యము.

క॥ ధరనఖిలసుఖంబులకా।
కరమైకరహాల్లసిల్లుఁగలికిరో!సత్యం।

బరయఁగనది లేకుండిన।
వరధర్మసమూహమెల్ల వ్యర్థము గాదే॥ ౨౦॥

క॥ కావున సాధ్వీరత్నమ!
సీవనవరతంబు సత్యనియతి గలుగుటన్।
వావిరిఁగోరుకొను మెడ।
భూవినుతలసద్యశంబుఁ బొందెదవు సుమీ॥ ౨౧॥

క॥ అరయన సత్యములాడుట।
దురితంబులకొఱకుఁ గానఁ దొడరిధరిత్రిన్।
నిరతము సత్యమె పలుకుము।
దొరకొను నిహపరసుఖములతులితములగుచున్॥ ౨౨॥

క॥ ఉల్లసిలుచునుల్లంబునఁ।
గల్లలుకొల్లలుగఁ బలుకు కల్లరిననయుం।
బెల్లరు నవ్వఁగనొల్లరు।
పల్లవపాణి! పిదపనిలఁ బ్రతికినఁబరువే॥ ౨౩॥

క॥ హాస్యంబునకైనను నరి।
హాస్యంబునకైనఁగల్లలాడవలదుజం।
ద్రాస్యులవశ్యము బ్రతుకఁ ప।
హాస్యంబగు నన్నృతమాడునతివకు నెపుడున్॥ ౨౪॥

" ఒకసారితప్పుచేసిన।
నొకటన్ మాటాడఁబోక తెప్పుకొనుమియెయుఁ;
కబొంకినచో వెంటనె।
నొకటికి రెండౌను సుమ్మ యోగ్యత చెడుచున్॥ ౨౫॥

## బంధుప్రీతి.

క॥ తలపోయఁగ జననీజన
కులుతోఁ బుట్టువులె గాక కుటిలాలక! నీ
కిల బంధుజనములుందురు
చెలిమి నెరపువారి మొదఁ జిత్తములలరన్॥ ౨౬॥

క॥ అత్తామబిడ్డలెప్పుడు
క్రొత్తడి! నినుఁ గోరి మెచ్చుకొనునట్టు వడిఁద
చిత్తమెఱిఁగి వర్తింపుము
హత్తింపుము వారి మదుల నానందంబున్॥ ౨౭॥

క॥ బావల నన్నల పగిదిని
దేవరులను తమ్ములట్లు తేకువతోడన్
నీవిల నత్తనుఁ దల్లిగ
భావించిన నీకు నఖిల భాగ్యములొదవున్॥

## సత్సహవాసము.

క॥ మహిని నవరతంబును స
త్సహవాసము సేయఁ గోరు సంతసమెసఁగన్
మహిత గుణాళులబ్బును
మహిళామణి! నిన్ను జనులు మన్ననసేయన్॥ ౨౮॥

క॥ జారిణులతోడ నితరుల
దూరులతో నీచసతులతో దుష్టులతో
నారీరత్నము లెన్నఁడుఁ
గోరం జనదన్న చెలిమి గాంచెంబైనన్॥ ౩

# స్త్రీనీతిరత్నాకరము.

## విద్య.

క॥ ఇలవిద్యయొసఁగువినయము।
వెలయఁగవిజ్ఞానమిచ్చువిదితయశంబున్।
బాలయిందునుగానబాలతి।
చెలువుమిగులవిద్యనభ్యసింపఁగవలయున్॥ ౩౧॥

క॥ పడతుక! పాటుపడిచదువఁ।
గడఁగుముమతిన్నస్వల్పకాలమెబడిలో।
నిదురదురునీతలిదండ్రములు।
పడయుటకష్టంబుపిదపఁబ్రాకటవిద్యన్॥ ౩౨॥

క॥ ధరనుద్యోగములొనరిం।
తురెకెచెచ్చెరవిద్యనేర్చితొయ్యాలులనుచున్।
బరుసములువలుకువారిని।
నిరసించుచువిద్యలెల్లనేర్చికొనఁదగున్॥ ౩౩॥

క॥ సుదతులిలవిద్యనేర్చినఁ।
జదువఁగలరుపుణ్యసతులచారిత్రంబుల్।
మదిముదమందుచువారల।
పదవిననుసరింతురమ్మపాయనివేడ్కన్॥ ౩౪॥

గక్కదనంబునకునుమతి।
ఘూతొడవులకునఁదోడువిద్యయుఁగలుగన్।
-ముఁగసానబట్టిన।
నిమానికమునగాదెసాధ్వికుమారీ॥ ౩౫॥

క॥ లలితవిభూషాంబరములు
గలిగియుఘనవిద్యలేక గాలెదు కాంతా।
తిలకములు దలఁచి చూడఁగఁ
బొలుపగు పరిమళము లేని పువ్వులు లెమ్మా॥ ౩౬॥

క॥ చదువెఱుఁగక విహరించెడు।
మదవతియిలభార్యయైన మగవాఁడకటా!
బ్రదుకుటకన్నన్ మృతియౌట।
సదుపాయమటంచు నెంచు సౌఖ్యము లేమిన్॥ ౩౭॥

## సద్గుణములు.

క॥ నగలున్నఁ జీరలున్నను।
మగువరో! చక్కఁదనమున్న మహిళావళికిన్।
దగఁగీర్తి నొసఁగఁజాలిన।
సుగుణంబులు లేకయున్నఁ జూడరు లోకుల్॥ ౩౮॥

క॥ మణిగణమయభూషణఘన।
ధనసంపద లేకయున్నఁ దరుణీమణినిన్।
గణుతింతురు చాలఁగ వర।
గుణసంపదఁ గలిగియున్నఁ గోవిదులెల్లన్॥ ౩౯॥

క॥ మానుగ దైవంబిచ్చిన।
దానిని ఘనమంచు నెంచి తానెల్లపుడున్।
మానిని! తృప్తివహింపన।
మానససుఖానికమందు నునిజము జగతిన్॥ ౪౦॥

# శ్రీసీతారత్నాకరము.

## చౌర్యము.

క॥ ననునెవ్వరుచూడుటలే
దని చౌర్యము సేయఁబోకు మల్లన సర్వం
బును వీక్షించుచు దైవము
వెనుకొని యు ద్దాఁడు ను మ్మభీకరుఁడగుచున్॥ ౧

క॥ దొంగపనిఁజేయు జనులా
యింగనఁదము జేరనీయర వ్వలజగతిన్
దొంగ దఁటం దురు కీర్తికి
భంగము వాటిల్లుఁ జాలఁ బాపము గలుగున్॥ ౧౨

క॥ పరధనమొక తృణమైననుఁ
దరుణీమణి! తాకఁ బోకు తగదది యొక్కో
నరయమిచేఁ దీసిననీ
ధరణిన పయశంబువచ్చుఁ దథ్యము సుమ్మీ॥ ౧౩

## త్యాగము.

క॥ ధనవతి నని గర్వింపక
మొనరింపఁగవలయు నమ్మ యువిదరో! సతతం
బును ధర్మ మంగహీనుల
కు వుగ నద్దానివలనన గుపుణ్యంబుల్॥ ౧౪
...ంబో నరించిన ఁగదు
...గు పుణ్యమంచు నెత్తి తలఁపుతో
...ంటను దొంగిలి
...ంపజన దమ్మ దానావళులన్॥ ౧౫

క॥ వందించినసేవరైనను।
సుందరి! యుప్పొంగియున్నసామ్మునకుమీ।
ముందుఁగనీశక్తివరసి।
పొందుగధర్మంబుసేయఁబూనుముజగతిన్ ॥౪౬॥

మితవ్యయము.

క॥ కడునిడుమలఁబడినాధుఁడు।
గడియించినవిత్తమెల్లఁగాలుచుఁబుడమిన్।
జెడువెచ్చంబులఁజేయం।
గడఁగఁజనదుదానమగఁడుకష్టమునొందున్ ॥౪౭॥

క॥ చాలదుతేతెమ్మనివరుఁ।
జాలఁగబాధింపరాదుసంతసమెసఁగన్।
వీలెఱిఁగియున్నవట్టుకె।
వాలుంగంటి! గడుపుకొనవలయుంజుమ్మీ ॥౪౮॥

క॥ ధనవతులిలధరియించెడు।
ఘనభూషణవస్త్రతతులఁగనుఁగొనివనితా।
మణులల్లవానిఁదమకునుఁ।
గొనుమనివరులవిసికింపఁగూడదుసుమ్మీ ॥౪౯॥

క॥ అతివరో! లెస్సగఁగలదని।
యతిసంతోషంబుతోడననవరతంబున్।
శ్రితసమూహకవ్యయపరచక।
మితముగవామకొనవలయుపొలఁతుకవతో

## అహింస.

క॥ పొలతుక! నీపాదంబున।
ములువిఱిగిన నెంతశ్రమముప్పట్టునో సుమతీ!।
తెలిసికొని జీవహింసల।
నిలఁజేయకు బాధలన్ని యెన్నఁగ సమముల్॥౫౧॥

క॥ ధరనాటలాడుకొని యెడ।
తరుణంబున నైనజీవతతులకు బాధల్।
బొరయింపక దయఁదలఁపుచుఁ।
దరుణీమణి యాడఁదగును డా నెల్లపుడున్॥౫౨॥

క॥ పామరమతులై భువిలో।
జీమలు మొదలైనయల్పజీవుల నెపుడున్।
లేమరో! కాల్చంజావఁగఁ।
బాముచునుందురకటకట! పాపముగాదే?॥౫౩॥

క॥ ఓవనితామణి! యిటువిను।
మీవనయముజీవకోటి మీఁదదయగనినన్।
వేవేగ మెత్తా మెచ్చుచు।
దైవముముదమందినిన్నుఁదప్పకఁ బ్రోచున్॥౫౪॥

## కోపము.

ముసద్గుణగణముల।
నుఁబాపములఁ బెంచుమహానవిరళసం।
నుఁబూవునుఁగావునఁ।
బూనఁగఁదగదది గోప్యముఁ

క॥ పనివారలనాపనిసీ।
పనిజేయుమటంచుఁబోలతిపల్కరుఁగోపం।
బునఁబరుషంబులుపలుకక।
పనిఁగొనుమెప్పునుమంచిపలుకులతోడన్॥౫౬॥

క॥ అసువులువిసుగఁగదాసీ।
విసరంబునఁగసరినఁబనివీసంబైనన్।
వెసఁజేయరుసరసిజముఖి!।
యసూయచేఁజెడ్డదందురనిశమునిన్నున్॥౫౭॥

క॥ మగువరో! "చెలిమింజేదిడ।
నగుబలిమించాలుఁపోయసలవియె?" కానన్।
దగమంచితనంబునఁబని।
జగతింగొనవలయుఁగానిచనదొంపుగతిన్॥౫౮॥

## గర్వము.

క॥ ధనముంజక్కందనముం।
గనుఁగొనితగఁగ్రింపుమీఁదుఁగానకమగుడన్।
దనపాటివారులేరని।
వనితామణిగర్వమందవలవదుసుమ్మీ॥౫౯॥

క॥ సంపదగుణసంపదయునుఁ।
బెంపెసఁగఁగఁగఁజాలునట్టివినయంబునుఁ,
శ్లాఘింపుగధరియింపకవిహా।
మితముగనెయత్నించుకాంతఁబ్రేమింపఁగా

క॥ వినయవివేకతలుగలిగి।
యనిశంబును మెలఁగుసతులనందరుభువిలో।
ఘనముగఁజూతురు నాతిరో!॥
వినుమలఁతిగఁజూచివిట్లువిగెడువారిన్॥౬౧॥

క॥ పొలుపుగనీకెంతకలిమి।
కలిగిననాక్రింతనైనగర్వపడకుమీ।
తలపోయంగఁగలిమిలే।
ములుకావడికుండలనుచుమును వినలేదే॥౬౨॥

క॥ లలితాంగి!సిరులుతిరమను।
దలఁపునగర్వింపఁబోకుదైవాజ్ఞ మెయిన్।
బలిమియుఁగలిమియుదొలఁగిన।
నిలనెకసకెమాడుచుందురెల్లరునిన్నున్॥౬౩॥

శరీరారోగ్యము.

క॥ కాయముగాపాడుకొనను।
పాయముజూడంగవలయుఁబాయకనీవో।
తోయజముఖి!యివియదిదల।
పోయఁగధర్మములలోనముఖ్యమునుమ్మీ॥౬౪॥

రువినముననాగిస్నానం।
రింపఁగవలయునమ్మయోపికతోడన్।
నిముదికెపోవఁగ।
!పుటుసేయకున్నవ్యాధులుగ

క|| నిరతము స్నానము మానక|
సరగున మఱిమఱికి లేక చనువస్త్రంబున్|
ధరియింపవలయు నయ్యాది|
కరము విలువ లేనిదైనఁ గాని మ్ముసతీ||౬౬||

క|| ఎండనకను వాననకను|
మెండుగ స్నానములు జేసి మెలఁతుక! ధరణిన్|
దండిగ నాచారంబుల|
నుండిన నీ దేహ మెప్పుడుండదు సుగతిన్||౬౭||

క|| కలుషజలంబులు ద్రావినఁ|
గలుగును నిక్కంబు తెవులు గావున జగతిన్|
నెలతలు వడియం గట్టిన|
జలములు గ్రోలంగవలయు సౌఖ్యము కొఱకున్||౬౮||

క|| "హితమౌ పదార్థమైనను|
మితముగఁ దినుము" న్న మాట మెలఁతుక! వినవే|
మితి తప్పి భుజించినచో|
క్షితిఁ గలుగుట తెవులు సిద్ధము సుమ్మీ||౬౯||

క|| గడగడనాడలాగి వడఁకఁగ|
పడఁతుక! తడిబట్టఁ గట్టి పనులను జేయం|
గడఁగఁగ రాదెన్నండును|
గడువడి నాడలెల్ల జెడెదు కాలము వచ్చున్

క|| చెడుగాలి తగిలిన నాడలు|
... ములంటునన్న చేడియ! యెవుడు
మితముగ...

బడవానరింపకవాకిటఁ।
బడియుండెడుకుక్కవంటఁబాపఁగవలయుఁ॥ ౭౧॥

శరీరకష్టము.

క॥ కష్టపడినబలమొదవుం।
గష్టపడినవ్యాధులేమికలుగకయుండుఁ।
గష్టపడినసుఖముగనిలఁ।
గష్టపడఁగవలయుసుఖముకలుగుటకొఱకుఁ॥ ౭౨॥

క॥ ధనమింతయుండదాసీ।
జనులిందరుగల్గియుండసదనముననిసీ।
పనిసేయఁగనాకేమని।
తినియుండకకష్టపడుముదీర్ఘాయువగుఁ॥ ౭౩॥

క॥ ఒడలలయనుచుఁదలఁపక।
పుడమిందగఁగష్టపడినఁబోలతుకలెప్పుడుఁ।
బడయుదురెల్లసుఖంబులు।
నుమవరే "కష్టిఫలీ" యనుచునార్యులిలఁ॥ ౭౪॥

శాంతము.

క॥ ఇంతి! యఖిలధర్మంబుల।
కెంతయునొకశాంతగుణమెయిమ్మగశోభఁ।
సంతతముఁదెచ్చుఁగావున।
శాంతమునుఁదాల్పవలయుఁజానలుపుడమిఁ॥ ౭౫॥
పైజనులొకవేళఁ।
నేరంబువారిఁజీరికుమాగి

చక్కఁగ నుపకారంబును।
సుకృతక జేయుఁగవలయుఁ జుమ్మీ పరులకున్ ॥౨౧॥

క॥ తనువులు శాశ్వతములు గా।
వనయముఁ జేతలు చిరంబులవనీస్థలిలో।
వనితామణి! గావున నీ।
వొనరింపు మెపుడుపకార మొరులకు వేడ్కన్ ॥౨౨॥

క॥ లలనా! పరులిడుమఁ బడిఁ।
పిలపించెదు సమయమందు వేగము చనివా।
రలకుపకారముఁ జేయుము।
యలరి మతులు నీకు వారలటు లొనరింపన్ ॥౨౩॥

క॥ పగవారలైనఁ దెగుళులఁ।
దగిలి పొగులుచుందురేనిఁ దరుణీ! వారిం।
దెగడక తోడ్పడుచు మఱి।
దగుమాటల నూఱడింపఁదగుఁ దయతోడన్ ॥౨౪॥

## ధైర్యము.

క॥ ఇడుములు వచ్చిన వేళల।
బడతుక! ధైర్యంబు విడువవలదు సుమ్మీ।
పుడమిందగ ధైర్యంబున।
డుములు సగమడఁగిపోవు నెంతటివైనన్ ॥౨౫॥

డవచ్చిన భామిను।
ట్టిన ధైర్యమెడలి యడలిన చో

యాపదయత్యధికంబై।
చూపట్టునుగూడి రాదుసుమి లేశంబున్ ॥౭౬॥

## బాలశిక్ష.

క॥ బిడ్డలు చేసిననల్లరి।
యెడ్డితనంబెసఁగఁదిట్టి యెన్నండునుఁదా।
గొడ్డునుఁగొట్టినయట్టుల।
గడ్డలిగి వెలందికొట్టఁగాఁజనదుసుమీ॥౭౭॥

క॥ మాటికిబిడ్డలగొట్టిన।
బోటిరో! కమ మోటబారిపోవుచు మతియున్।
జేటగు నాయువుపట్లగు।
చోటులనది తాకె నేనిఁ జుకటిఁగఁజేయున్॥౭౮॥

క॥ కొట్టినఁదిట్టిన మొట్టిన।
మెట్టినబాలురకుభీతిమిక్కిలిమదులన్।
బుట్టదుతగుమాటలచే।
గట్టిగఁజెప్పంగవలయుఁగడకొనిభయమున్॥౭౯॥

## వివిధధర్మములు.

క॥ ఇతరులునీకేవిధమున।
సతతముజేయవలయునని సంతసమునసీ।
మతెదలఁచెదవో సతి! యా।
గతినేనితరులకునీవుగావింపవలెన్॥౮౦॥

క॥ [illegible]సంపదఁగనుఁగొని।
మితముగ[illegible] గోర్వలేమి మహితుచ్ఛగుణం[illegible]

బతివలు! కావున వానిని।
సతతము విషవంగవలయు జాగ్రత్తతోడన్॥౯౧॥

క॥ నీకొంరులోనరించిన మే।
లేకాలము నందు మరువకించుక యైనన్।
జేకొని వారికి నర్మిలి।
బ్రాకటము తిమరల మేలువలయును సలుపన్॥౯౨॥

క॥ కడుపాఱంగుడిచి నిలుచుచు।
నడివాకిట నిరుగుపొరుగు నారులతోన।
కడవారి వీరితప్పులు।
తడవుటదుర్గుణము సుమ్ము తరుణికి నెపుడున్॥౯౩॥

క॥ పనిలేక యొహరుగిండ్లకుఁ।
జనియచ్చటఁ గూడుతోడ చానలకెపుడున్।
గొనకొని గృహకృత్యంబులు।
వినుపింపకుము స్మసివు వేడుకతోడన్॥౯౪॥

క॥ పనిలేని సమయముననవా।
రిని వీరినిఁ జేరఁదీసి గృహమునకతివా।
యనుచితపుఁ గోష్ఠి నుండఁగఁ।
జనదు పతివ్రతలకథలఁ జదువుము వేడ్కన్॥౯౫॥
రాకేందువదనఁ తాఁదల।
వాకిటఁ జేరిహొరుగింటివారల నెపుడున్।
కొని రారమ్మంచునఁ।
లు వేసినగ రాదు కీడగును సుమ్మీ॥౯

సతిగావున సద్గుణయుత!
మతిగల్గి నిరంతరంబు మానక గావలయున్||౧౦౨||

క|| వినుమా నినుఁగనఁగోని తా|
ననుమానము మాని మానవాధముఁడొకఁడున్|
దనమాయలఁ జూపినచో|
జనుమా యవ్వలకు నీవు సత్వరగతితో||౧౦౩||

క|| తరుణీ! యాస్త్రిస్వభావముఁ|
బరనిందయుఁ గూడ దెప్పుడుఁ బరికింపంగా|
వరగౌరవముఁ జెఱచి యోషను|
ధర నిందలపాలు సేయుఁ బెక్క్యము సుమ్మీ||౧౦౪||

క|| ధరపైకి సాధుభావము|
గరుతరముగఁ జూపిలోన గుత్తుకఁగోయున్|
వెరవూహింతురు కుజనులు|
తరుణీ! యవి కూడ దెట్టి తరుణమునందున్||౧౦౫||

క|| అనయము వినయము వెలయఁగ|
గుణవతివై భర్తసేవఁ గొల్చుచు భక్తిన్|
నినుఁగన్నవారికిఁ గై|
కొనువారికిఁ గీర్తిఁ దెమ్ము కొమ్మా! జగతిన్||౧౦౬||

పరుసదనము దూరకు మీ|
పరుసదనము దూరు మీవు భాషించు నెడన్|
రు వేడబోకుము పరా|
ఎరు వేడుము హృదయమందు దైన్య

క॥ ఇలఁగలభాగ్యంబంతయుఁ।
బాలతికీవరుఁడేయటంచుఁ బొందుగ మదిలోఁ।
దలపోయుచు సేవింపుము।
కలకాలము జనులు మెచ్చఁగా నినుఁగలికీ॥ ౧౦౮॥

క॥ సతివై యనుపమవిద్యా।
వతివై సకలసుగుణతతివై భూరికృపా।
మతివై సంతతనయపథ।
యుతవై వెలుగొందుచుండుమూర్వీస్థలిలోన్॥ ౧౦౯॥

క॥ పదిలంబుగఁబరిఢవించిన।
సుదతిమణీ! దీనినీవు సుజ్ఞానమిడున్।
మదిఁదలఁచి సులభశైలిని।
ముదమున రామలకు రామమూర్తి రచించెన్॥ ౧౧౦॥

సంపూర్ణము.



మితముగ…

